శ్రీరస్తు.

# మోహిని.

( నాలుగంకముల నాటకము. )

గంగుల నారాయణరెడ్డిగారి విరచితము.

పల్నాడుతాలూకా మల్లవోలు (పిల్లుట్ల) గ్రామవాస్తవ్యు

లగు కీ॥ శే॥ పెండాల సుబ్బరామయ్యశ్రేష్ఠిగారి ధర్మపత్ని

యగు గురమ్మగారి ద్రవ్యసహాయముచే

గుంటూరు కన్యకా ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

మొదటి కూర్పు 500 ప్రతులు.

1935.

# ఈ నాటకమున రాగల పాత్రలు.

## పురుషులు.

శ్రీమన్నారాయణుడు
బ్రహ్మ
ఇంద్రుడు
సూర్యుడు
వరుణుడు
వైశ్వానరుడు
వాయుదేవుడు
యముడు
చంద్రుడు
బలిచక్రవర్తి
నముచి
శంబరుడు
బాణాసురుడు
కాలుడు
కేయుడు
రాహువు
నారదుడు
పరమేశ్వరుడు
ధన్వంతరాదులు వచ్చెదరు

## స్త్రీలు.

మోహిని
లక్ష్మి
పార్వతి

# పీఠిక.

నాటకముపేరు మోహిని దీనినే భాగవతములో బమ్మెర పోతరాజుగారు క్షీరసాగర మథనమని లిఖించియుండిరి. యిది దుష్ట శిక్షణ శిష్టరక్షణకొరకు భగవంతుడు జేసిన మంచియుపాయము, యీ కథలో కొన్ని నూతనాంశములు భగవంతుని దయచే నాకు తెలిసిన వరకు వ్రాసియుంటిని అవి భక్తులకు మహానందము యిచ్చునని నమ్మియుంటిని (చతుర్థాంకము పార్వతి పరమేశ్వరుల ప్రవేశము పార్వతి) స్వామి భగవంతుడెచ్చటయుండును. కైలాసమునకు వైకుంఠమునకు భేదమేమి అర్థముగా విడివిగా చక్కగా బోధించుడని అడుగును. అవి యేలాటి సంగతి ఆనతిమ్మన సంశయ విచ్ఛేదమౌనట్లు పరమేశ్వరుడు చెప్పెను. దేవతలు రాక్షసులు మందరగిరి దెచ్చి పాలసంద్రములో వేసి తరచుచుండ అమృతము బుట్టెను దానికొరకు వారు తగవులాడుచుండిరి. అట్టి సమయమున భగవంతుడు జగన్మోహిని యయి రాక్షసులకందకుండ దేవతల కమృతము నిచ్చెను తరువాత సురాసుర యుద్ధము జరిగెను. అటుపిమ్మట పరమేశ్వరుడు మోహినిరూపము చూడవలెనని వచ్చి చూచి మోహసముద్రములో మునిగి అంతలో కనుగొనెను. యీ కథాంశమంత చదువరులకు మున్ముందు తెలిసియేయున్నది యిక నే చెప్పునది అన్ని పుస్తకములతోపాటు నీమోహినియను పుస్తకముకూడ అచ్చొత్తించవలెనని నాకు తోచినది యింతలో శ్రీ ఆర్యమిత్ర మండలి సభ్యురాలు పాలసముద్రమునకో తులదూగు కొనకొండ్ల రమణయ్య శ్రేష్ఠి, సుబ్బమ్మగార్ల గర్భజనిత శ్రీయుత కీర్తిశేషులగు పెండాల సుబ్బరామయ్య శ్రేష్ఠిగారి సతి గురమ్మయను నామధేయముచే వెలుంగుచున్న భక్తురాలింటికి కొందరు మిత్రులతో నేను వెళ్లియుండ గ్రామము మల్లవోలు తాలూకా పల్నాడు అచ్చట మాట ప్రస్తావనగా నేను

వ్రాసినగ్రంథముల అచ్చొత్తించు వారిపేరులు కొనియాడి నేనొక గ్రంథమును అచ్చొత్తించెదనని తటాలున ధైర్యముతో బలికెను. యీ యామెగారి ధైర్యము చెప్పుటకు వలనుపడను. పురుషులలో స్త్రీలు స్త్రీలలో పురుషులు గలరని భక్తులు చెప్పుచుండిరి. కవులు వ్రాయుచుండిరి గాని నిదర్శనము మాకు యీ యామెయందె యగుపడెను ఆసమయమున అచ్చటున్న భక్తులందరు ఆమెభక్తికిమెచ్చి సంతోషించిరి. నే నీమోహినినాటకముపేరు జెప్పితిని. ఆమెయుసంతోషించెను. భక్తులన్నను గురుపుత్రులన్నను యీ యామెకు మహాప్రేమ. యెన్నిపనులున్నప్పటికిని ముందు వారిని విచారించి తనుపరి తమపనులను చక్కబెట్టుకొనును యింక నామెసుగుణములు వేరుచెప్ప నేల ఈమెచేయుభక్తికి మెచ్చి పుట్టినిల్లుచొచ్చి నిల్లు ఆభగవంతుడు వృద్ధిచేసి యిటువంటిసుకరమయిన పనులే జేయుటకు బుద్ధికినవకాశమిచ్చి దేశోద్ధారణకై నామెను రక్షించుగాత.

మల్లవోలు.
తా॥ ప॥
ది. 15-3-1935.

యిట్లు
గంగుల నారాయణరెడ్డి.

శ్రీ ర స్తు.

# మో హి ని.

## ప్రథమరంగము — వైకుంఠము.

(శ్రీమన్నారాయమూర్తి శేషపాన్పుపయి బరుండియుండును.)

(బ్రహ్మ, ఇంద్రుడు, సూర్యుడు, వరుణుడు, వైశ్వానరుడు, వాయుదేవుడు, యముడు తెరలో)

బ్రహ్మ — శ్రీమన్నారాయణ స్వాములవారికి జై.

ఇం. సూ. వ. వై. వా. య — శ్రీమన్నారాయణ స్వాములవారికి జే.

(నమస్కారపూరితులై ప్రవేశించి)

గీతము.

శ్రీరమణ శేషశయన శ్రితజనా-వనబ్రోవుమ
వారిజాక్ష వైకుంఠ-దారిజూపర దయాసాగర॥ శ్రీ॥
అందమైననీరూపు - సుందరాంగ జూపరార
ముందునీకు వందనములు - బృందారభక్తమందార జయ
మందార॥ శ్రీరమ॥

ఇంద్రు — గీ॥ దైవతములలో ననుమరి ♦ దైవమీవు
భూతములకెల్ల నాధార ♦ భూతమీవు
వెలయు లోకంబునంతట ♦ వెలసినావు
భక్తి నినుగొల్చుటకు మాకు ♦ బలమునిమ్ము॥

సూర్య - శా॥ దేవా నీమహిమేము చెప్పుటకుమున్ ♦ ధీరాత్మలేచాలరె
త్రోవన్ గాలగలేనిమాకు నెటులన్ తోస్త్రోడన్ గాంచుటల్
లేవామాకభయంబునున్ దయయినన్ లేవాసమంబాచుతా
రావాసాధులనేలగా విరివి యీ ♦ లాగేలనో మాధవా॥

వరు — ఆ॥ మూలకారణుండ ♦ వేల నీవింకను
జాగుచేయ సురలు ♦ చచ్చిపోరె

దండిరక్కసునిను ♦ మెండుగా ఖండించి
ఉండజాలుమయ్య ♦ యుచితరీతి॥

వైశ్యా- చ॥ సుజనుల రక్షకై భువిని ♦ చోద్యము జెందగ మాటిమాటికిన్
నిజముగ దాల్చి రూపు మొక ♦ నిట్టులు బూనెదు దేవదేవ మా
గజిబిజి పాటుగాంచి కృప ♦ గల్గిన నల్గక చిత్తమందు ని
రజములు బోలు పాదముల ♦ రాత్రి బవల్గను గొల్తుము చ్యుతా

వాయు- మ॥ మటుమాయమ్ముగ యొష్టో జేసి జగతిన్ మమ్మున్ బడంగన్ ఖిరా
నట్టుద్రోయంగను నీకు నేమిఫలమో నన్నానే మొధర్మంబు ని
విటులం జూడగరాదు సేవకుల ♦ తప్పేమిన్ గనుగొంటినో
యిటమీదన్ మము రక్షణమ్మున యమున్ యిట్లే జేయంగదే

యము- ఉ॥ ఆశకులోనుగాక తుది ♦ యాశలలోన బడంగబోక యా
కాశము బోలు దేహముని ♦ కన్గొనుయాస్యుల బ్రోవ నీవెగా
నాశము లేని జీవనము ♦ నమ్మిన వారము మాకునివ్వవే
ఈశ మరీచ ముఖ్యులకు ♦ రాధిపదంబిదె భక్తవత్సలా॥

బ్రహ్మ- సీ॥ కోటిసూర్యులకాంతి కామ ♦ రొప్పు నీదేహ
మెపుడు జూచెదుమార్గ ♦ మిపుడునివ్వ
పతితపావననామ ♦ బాధకులైనయ్య
వచ్చిరి సురులంత ♦ వరుసగాను
మరువకుందురు మేలు ♦ మహనీయ నీమేలు
కృతకృత్యులను జేయు ♦ కృపనుగల్గి
నసమాన తేజులౌ ♦ యసురులంతయు వచ్చి
కసిమీరి స్వర్గంబు ♦ గట్టినారు
గీ॥ దిక్కు నీవనివచ్చియు ♦ మ్రొక్కినాము
బ్రతుకు దెరువేదో వారికి ♦ బ్రదుకనివ్వ
వరములివ్వుము భయము చో ♦ దిరము రాను
నిరపరాధులు దేవతల్ ♦ నీరజాక్ష॥

( శ్రీ మహావిష్ణు లేచికూర్చొని )

దివిజులారా

గీ॥ సమయమే తెంచువరకును ♦ చాలనట్లు
వదిగియుండియు తదుపరి ♦ కదలకుండ
చేయవచ్చును శత్రుల ♦ చేతనయిన
పాలసంద్రము దరువుడు ♦ ఫలముగలుగు॥

ఇంద్రు— స్వామీ! అది యెట్లుతరువవలెను దానిలో నేమిఫలము గలుగును.

శ్రీమ—మందరగిరి పెకలించి పాలసంద్రములోవేసి ఓషధులుబోసి వాసుకిని త్రాడుగాజేసి చిలికిన అమృతము బుట్టును. అది పానముచేసిన చిరజీవులయి ఆహారపానీయములతో నవసరము లేక బలముగలుగు శత్రువుల జయింపవచ్చును.

యము—కష్టపడినను మాకది చిక్కనిస్తుర

శ్రీమ— యెవరు

సూర్య—రాక్షసులు

వరు—నిజముగా అంతే జరుగును

వైశ్వా—బలి నముచి కాలకేయాది రాక్షసులకు ఎట్టిగొట్టము చేయుచుంటిమి. మాకది యెట్లులభించును.

వాయు—కష్టించి యమృతము బుట్టించినను మాకది లభించుట దుర్లభము.

బ్రహ్మ—ఔను వారిపన్ని పయినబోవుచున్నది.

(శ్రీమహావిష్ణు లేచివచ్చి)

ఆ॥ మాటలోనవారి ♦ మరిపించి యమృతంబు
మీకువచ్చునటుల ♦ మేలుజేతు
తిరిగిపొండి మీరు ♦ తిరమతిబూనండి
చేయబూనుపనులు ♦ చేయరండి॥

(అందరు నిష్క్రమింతురు)

2 రంగము— పాలసంద్రము.

(బలి నముచి శంబరుడు బాణాసురుడు కాలకేయులు వీరు రాక్షసులు.)
(ఇంద్రుడు సూర్యుడు వరుణుడు వైశ్వానరుడు వాయుదేవుడు యముడు వీరు దేవతులు.)

అందరు—(పర్వతము భుజములపైనిడుకొని) జాగ్రత పొర్లిపోవు చున్నది చెడునవ్వుచున్నది. ఒరె ఒరె ఒరె పడెర
(అని కూలబడుదురు. పర్వతము పైనబడును ఒకరి నొకరిని బట్టుకొని బైటికీడ్చుకొందురు.)

బలి—గీ॥ సేయుచుంటిమిగా నిక ♦ సేయ లేము
పర్వతము మర్ల లేవదు ♦ పట్టుటకును
ఓపికలు తగ్గిపోయెను ♦ నాపిదీని
పోయి యిండ్లకు సుఖములు ♦ పొందుదాము॥

బాణు— నిజము నిజము మానాన్నగారు జెప్పినమాట నిజము.

శంబ— బ్రతికితె బ్రతుకుతం చస్తె చస్తం పట్టండశ పట్టిడిసినకన్న ప్రాణంమిడిచింది మేలు.

నము— ఆ॥ వలదు వలదుపట్టు ♦ వలసినఫలమేమి
కానరాదు చూడ ♦ కానరాదు
ఫలము లేనిచావు ♦ బలితమేమున్నది
యురుకవలదు మనకు ♦ తిరిగి చూడ.

కా— ఆ॥ సగముజేసి మరల ♦ చాలించుటకునేమి
పట్టుడంత మరల ♦ పట్టుచుంటి:
(అని వంగిపట్టును)

కే— ఆ॥ పిరికితనము మనకు ♦ పేరుకు లేదుగా
నేను బట్టుచుంటి ♦ నిపుడు మరల.
(అనిపట్టును అందరుక్రమ్మురుదురు పర్వతము లేవదు.)

ఇంద్రు— (నమస్కారపూరితుడై)
కం॥ నారాయణ నీనామము
పారాయణజేయువారి ♦ భయములుదొలగున్

నారాయణ నీనామము
సారాంశము దేవ దేవ ♦ సత్పురుషులకును

సూర్య— గీతము.

దేవరార విష్ణుదేవరార ॥దే॥
తావకీయపాదములకు ♦ దండము లిడుచున్నారం ॥దే॥
శరణాగత త్రాణ ♦ బిరుదుచేగలవాడ కరుణించు మమ్ముల
కమలాక్ష దీనరక్ష॥దే॥

గీ॥ ఏలబోతిమి హీనముగ ♦ యేలయిటుల
వాగు సెలవిచ్చిరి మనకు ♦ దారియేది
తోయజాక్షుడు రాడేమి ♦ తోడుగాను
యెంతులకో యింత ఆలస్య మెందులకోను.

సై, వా, య— మత్తకోకిలము (ఫీలురాగము)
నీదురాకకు జూచుచుంటిమి ♦ నిర్మలాత్మకరావరా?
సాధుపోషక నీమనంబున ♦ సంతరించవదేమిరా,

(శ్రీమహావిష్ణు గరుడవహనారూఢుడై ప్రవేశించును.)
(దేవతలంతా నమస్కారపూర్వకులయి)
మత్తకోకిలము (మోహనరాగము.)
యేదినీదయజూపి మమ్ముల ♦ యేలుకోవది యేలరా
రాదుయిపుడు కొండయెత్తను ♦ రాక్షసాదులకైననూ.

శ్రీమ—అలాగా. (అనికొండ బట్టియెత్తి గరుడపైనుంచి గరుడుని సైగ
చేయును. పాలసంద్రమువద్దపడవేయును.)
(దేవతలు రాక్షసులు చెఱుగులుబాగా నెగదోపి వాసుకిని
త్రాడుగాజుట్టి)

ఇంద్రు— అసురులారా! మీరందరు పుచ్ఛమునుబట్టుడు. శిరస్సుల
వైపు బట్టెదము.

బలి— మీరంత బలవంతులా మేము శిరస్సులవైపుబట్టెదము.

దేవతలంత— సరె (అని తోక వైపునకు తిరుగుదురు.)

దే—రా—(కొండ పాలసముద్రములో విడచి ఓషధులను వేసితిప్పుచు)

గీతము.

దే— కురుసెను వర్షము
రా— కోరికలుమీరగను
దే— తరువుడి యమృతము
రా— బిరబిరజననము

(కొండపాలసముద్రములో మునుగుచుండును. దేవతలు రాక్షసులు చీకాకయిపడిపోవుదురు. శ్రీమహావిష్ణు కూర్మావతారమెత్తి కొండ వీపుపై నిలువబెట్టును అప్పుడు)

ఇంద్రు— పట్టుడు పట్టుడు భగవంతుడు కూర్మావతారమయి కొండ వీపుపయిని నిలవబెట్టినాడు. పట్టుడు. పట్టుడు.

అందరు— (లేచిమరలా ఎవరివైపువారు పట్టుదురు.)

దే— కురిసెను వర్షము.
రా— కోరికలుమీరగను.
దే— తరువుడి యమృతము.
రా— బిరబిర జననము.

(అప్పుడు కాలకూటముద్భవించి దిశలకెగబాకును. దేవతలు రాక్షసులు వాసుకి నిడిపించి యురుకుదురు.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# మోహిని.

## ద్వితీయాంకము.

ప్రథమరంగము — కైలాసము.

(పార్వతీపరమేశ్వరు లాసీనులయి ప్రవేశించియుండుదురు.)

దే— (ఒక వైపుగా } ప్రవేశించి.)
రా— (ఒక వైపుగా }

ఇ— బ— గీతము.

కాలకూటముపుట్టి ♦ కడలిదరచుచుండ ♦ కాలానిల సన్నిభము
యదిజూడగ ॥కాల॥
చాల చాలదయతో ♦ నేలుకో మమ్ముల ♦ చాలిన శివప్రభో
జాలముసేయక ॥కాల॥
నారాయణకవి ♦ నమ్మిననినుభువి ♦ రారామ్మన లేద. కోరికలు
నివవ ॥కాల॥

ఇంద్రు— గీ॥ గరళము దశదిశల బ్రాకి ♦ గడియలోన
పాలవెల్లిని యమృతంబు ♦ బడయుటెట్లు
నీవు దానిని మరలింప ♦ నేడు మేము
బ్రతుకజాలము తండ్రి యీ ♦ భయముతోడ

బలి— గీ॥ ఆశలుడిగెను గనగ ప్ర ♦ యాసయయ్యె
దానపోషక నీపైని ♦ యాసచేత
వచ్చితిమి మాకునభయంబు ♦ నిచ్చిబ్రోవు
లావు సన్నములనక కై ♦ లాసవాస॥

బాణా— మ॥ కలిమిర్లేములు వచ్చిపోవుననిమర్మ ♦ గన్గొన్నమహాత్ములే
కలనంబొందక జీవనమ్మువడుటే ♦ గాకర్ తిరంబాదుకే

విలయంబుల్ పయిబడ్డమాకునటులన్ నీలున్న దేయుండుటల్
పిలువంగన్ పలుకండి లేక పోయినన్ పీఁచ్చా గదా ప్రాణముల్

శా— (వెనుకకు తిరిగిచూచి) అదిగో స్వామీ బుగ బుగ మను మం
టల రవములతో భూమి యాకాశము బట్టుకుండ వచ్చుచున్నది.
దానినేదో నొకనుపాయంబుచేత మీరు సంహరించక పోయిన
మేము జీవించుట దుర్లభము.

కే—అయ్యా చచ్చినతరువాత సుఖము లెట్లుగల్గును అమృత మెందులకు.

ఆ॥ మూడులోకములకు ♦ చాలినవాడవు
మృత్యుసంహరుఁడవు ♦ మేలుజేయు
వాడవీవు మాకు ♦ చూడఁవిషహారణ మిపుడు
జేకయున్న ♦ యిరవుగలదె॥

యము—గీ॥ మునిజనమ్ములు నినుబిల్వ ♦ మోక్షమిపవ
కంజనమ్ములు నినుబిల్వ ♦ కలిమినివవె
జయముగోరెడి వారికి ♦ జయమునివవె
ప్రాణభయముచే వచ్చితిమి ♦ ప్రాణమివవె॥

ఈశ్వ—పార్వతీ యేమనెదవు. నీవు యిప్పుడుచూచుచునే యుంటివి.

పార్వ—— స్వామి! నీయిష్టము.

సీ॥ కరుణగల్గినవారికి— కానిదేదియు లేదు
సత్యవంతుల కెల్ల ♦ జయముగల్గు
ఒకరి శుభముగోరు ♦ సుకరులకిలలోల
గలుగదుకీడును ♦ గౌరవముగ
శరణనువారిని స్థిరముగాబ్రోచిన
వారికెక్కడిదిక ♦ భయమునిజము
సురలు నసురులు నిన్ సరిలేనిభయముచే
శరణని వేడిరి ♦ శాంతమూర్తి.

గీ॥ చెప్పుటకు నేను యెంతటి ♦ యొప్పుదాన
ఏదో మీయిష్టమైన దేదో కాని

దానిజేయుము మనుమాట ♦ రానుజెపు
కామరిపుజైత్రకల్యాణ ♦ ఘనపవిత్రి.

ఈశ్వ —

చ॥ గరళమువచ్చుచున్నదిక ♦ గ్రిక్కునమ్రింగుటదప్ప దానికే
మిరవును లేదు జె ఋజయు ♦ మిచ్చటగల్గునో గల్గదో యనన్
యరమర లేక జెప్పుటకు ♦ యన్యసుఖంబిదిగాదు జూడగా
తిరమతిబూనిదీనిదిని ♦ తీర్చెదనంబిక వారికష్టముల్.

పార్వ — చిత్తము.

(అందరునిష్క్రమింతురు.) తెరబడును.

2. రంగము — పాలసముద్రము.

(దేవతలు రాక్షసులు ప్రవేశించి)

దే — కురిసెనువర్షము.
రా — కోరికలుమీరగను.
దే — తరుపుడియమృతము.
రా — బిరబిరజననము.

(కామధేనువుబుట్టును)

దే — కురిసెనువర్షము.
రా — కోరికలు మీరగను
దే — తరుపుడి యమృతము
రా — బిర బిర జననము

(కల్పవృక్షముద్భవించును.)

దే — కురిసెను వర్షము
రా — కోరికలు మీరగను
దే — తరుపుడి యమృతము
రా — బిర బిర జననము

(ఉచ్చైశ్శ్రవము జననమవును)

దే-కురి॥ రా-కోరి॥ దే-తరు-రాబిర

( ఐరావతము గల్గును )

దే - కురిసెను వర్షము
రా- కోరికలు మీరగను
దే - తరువుడి యమృతము
రా- బిరబిర జననము

( లక్ష్మి వచ్చును )

దే - కురిసెను వర్షము
రా- కోరికలు మీరగను
దే - తరువుడి యమృతము
రా- బిరబిర జననము

( చంద్రావతారము )
( తెరవాలును )

(శ్రీమహావిష్ణు బ్రహ్మాదిదేవతలు నొకవైపుగా కూర్చొనియుందురు)
(బలి నముచిల కాలకేయాది రాక్షసులు నొకవైపు ఆసీనులైయుందురు)

లక్ష్మి—(పూలదండ చే నుండ తనలో)

గీ॥ పూలహారము వేసియు ♦ పూజగొనుట
కెవరునాకు తగినవార ♦ లెవరుచూడు
(అని కన్నులతో పరికించును)
శ్రీమహావిష్ణు చూపులో ♦ చిక్కినాకు
అయినసీతని సంపత్తు ♦ వరయవలెను.

సీ॥ క్రోధాది గుణముల ♦ కొట్టివేసిన బంటు
ధైర్యసాహసముల ♦ తాల్మిగలదు
వైకుంఠమేయిల్లు ♦ వందసీయుదు జూడ
సుందరాకారుడు ♦ చూపులకును

మూర్తివంతంబైన ♦ మొదటి నెలవరయ
నటనసూత్రమునకు ♦ నటికుడితడు
తరుగు లేమియు లేవు ♦ తరుణి లేదితనికి
పోయె మనసునాకు ♦ బుద్ధిగుదిరె.
ఆ॥ పూలహారమితని ♦ భుజములపై నుంచి
జేతు వందనములు ♦ జేతుపూజ
భర్తవీవెయంచు ♦ పద్మదళాక్షుని
హృదయమందు నిల్తు ♦ ముదముదనర.

యింకను నాకేమియు తరుగుగలదు పదునాల్గు భువనంబులకు ప్రభువైనప్రభువు నా ప్రభువు. భక్తసంరక్షణార్థమై యవతారముదాల్చు పురుషుడు. ముజ్జగంబులవేల్పు నా వేల్పు నా పురుషుడు. మోక్షప్రదాత వక్షస్థలంబె నాయిల్లు. యింక నాకుకావలసిన దేమున్నది ఏమియు లేదు.

( అని ధైర్యంబుతో వచ్చి పూలహారము వేసి నమస్కరించును సరసనకూర్చొనును )

బ్రి॥ దే.— ( కర్పూరము వెలిగించి ) జే లక్ష్మీనారాయణులకు జే. శ్రీ మంగళదేవతకు జే. భగవంతునకు జే.

(ఆకాశమునుండి పుష్పవర్షము కురియును.)
తెరవాలును.
(చంద్రుడు దేవతలలో ప్రవేశించును)
(రాహువు రాక్షసులలో ప్రవేశించును.)

దే—కురిసెనువర్షము
రా—కోరికలుమీరగను
దే—తరువుడి యమృతము
రా - బిర బిర జననము
దే- కురిసెను వర్షము
రా- కోరికలు మీరగను

దే- తరువుడియమృతము
రా- బిర బిర జననము
(ధన్వంతరి అమృతకలశము చేతబుచ్చుకొని బయలు దేరును.)
(రాక్షసులు వెంటనంటుదురు.)
నము- (తిరిగి) నేను యివ్వను అమృతకలశము
బాణా- అది న్యాయమా! నముచి కాదు కాదు యిట్లివ్వను.
(అని పీయూషపుకుండ గుంజుకొనును.)
శంబ- బాణాసురా యిది న్యాయమా నీవు జేసినపని
(అని సుధాభాండము లాగుకొనును.)
కా- ఏమి నీవకుపు శంబరాసురా యిదిగో నేను వచ్చుచుంటిని పోకు పోకు (అని చేతులోయున్న అమృతభాండము పట్టుకొనును.)
కే- నాకన్న మీరు బలవంతులా అమృతము నాకు లేకుండా మీరు త్రాగెదర వచ్చుచుంటిని.
(అని యాకుండను పోయి పట్టును.)
బలి- గీ॥ బలముగలవారికిది మంచి ♦ బలముగాదు
విలువగలవారికిది గాంచ ♦ విలువ లేదు
మనలో మనమె యిట్లుమనసు ♦ గనగలేక
నొకరిపై నొకరు యలిగి ♦ యుందురకట.
శ, కా, కే- (సుధా కడవనొకచో నుంచుదురు.)
ఇంద్రు- ఆ॥ బలిమినిట్లుయమృత ♦ భాండముగైకొని
పోవదగునమీకు ♦ పాడిపొండి
ధర్మమయ్యోనేని ♦ మర్మములేకుండ
పంచికొనుడువవలెను ♦ భాగసరిగ.
బలి- గీ॥ మాకె భాగముల్ కుదురక ♦ మణుగుచుండ
మీకు యెక్కడి యమృతంబు ♦ మిడుకుచుండ
యాసలుడుగుడి దీనికై ♦ యలసటేల
తరసినను మరల యమృతంబు ♦ తరసుకొండి.

ఇంద్రు- గీ॥ కలసిజేసితిమిటుల కడనువచ్చి
మిగులమాటలపనియేమి । మీరదగున
మధ్యవర్తినిమాట్లాడి । మనముగూడి
యమృతపానముజేయుట । యదియుమేలు.

బాణా- నాన్నా. యింద్రుడు జెప్పినమాట చాలబాగా యున్నది దానవులు, దైత్యులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు, యక్షులు, సిద్ధులు, సాధ్యులు గలరు. వీరిలో నెవరు పంచిబెట్టతగువారు

కా-కే- మనమే మనయిష్టము వచ్చినటుల పంచిపెట్టెదము ఉంటే ఉన్నవారలగుదరు, లేక లేచిపోయితె పోయినవారలగుదురు యిక రెండవమాట లేదు

రాహు-ఆ॥ బాగజెప్పినారు । బలె కాలకేయులు
తిరుగులేదు యింక । తిరుగవలదు
కాలహారణమేల । కడవచేతనుబూని
జూచి యమృతమిపుడు । జుట్టుకొందు.

చంద్రు- మీయిష్టమయిన నాయిష్టముగాదా యేమిటామాటలు. మాటలాడిన సరిగామాటలాడవలెను. లేకపోయిన నూరుకొనవలెను.

శంబ- నీవనగనెంత నీవుమాట్లాడుచున్నావ చంద్రా
(దేవతలంతా నిర్ఘాతపడి దిక్కులు చూచుచుందురు.)

(శ్రీ మహావిష్ణు మోహినిరూపమైవచ్చి నిలువబడి నటునిటుజూచి)

మోహిని- గీతము.

ఆహా వనమెంతో శృంగారము బంగారము ॥ఆహా॥
ఓహో అది బాలమరాళపు గుంపువలె నున్నదే క్షీరసాగరము
పైనుండునవి నవియేకా యేమిా వాటి చక్కదనము
(అని నవ్వుకొనును)
ఆహా వనమెంతో శృంగారము బంగారము ॥ఆహా॥

ఓహో ఇవెవరో కనబడుచున్నారె. (అటుజూచితలయూపు కొనును) దేవతలు. రాక్షసులు గాబోలు, ఆహా! క్షీరసాగర మధనకారకులా. అతడు రాక్షసులకు ప్రభువు బలిచక్రవర్తె, ఇతడు దేవతలకు యింద్రుడా అల్లతడు సూర్యుడా, ఇల్లితడు నముచ, ఔను కశ్యప్రజాపతిసంతత, సరె వారున్నది గజనిమ్మల వనమా. ఆవలి విరసాలవృక్షములా. ఆగజనిమ్మల ఫలములు, ( అని తనపమిడిచెరుగు, దీసుకొని స్తనములవంక జూచుకొనును) ఆకచుబడునవి అరటిబోదెలా. (అని తనతొడలవంక జూచుకొనును) అవియేన సంపంగి పుష్పములు. అని తననాశిక ముట్టుకొనును). ఓహో యిల్లివియేనా తామరకమలములు. (అని కన్నులు తడుముకొనును).

వాటిపై వ్రాలి మధురము త్రాగుచున్న భ్రమరంబుల రెక్కలా నాపయి నలుపు (అని తన వెండ్రుకలు చేతితోతీసుకొని కనులతో జూచును).

అవి హంసలయొక్క సమాజమా. నడుచుచున్నవే ( అనినడచును ) ఈవలిప్రక్కగా పంపర పనసవృక్షములకు అల్లుకొనియున్నది. మంచిదొండ ఆయెఱ్ఱగా కనుబడునవి వాటి ఫలములా. (అని హస్తముతిరుగవేసి మోవిచూచుకొనును).

వాటిమొదళ్ల కాడనుండి వచ్చుచున్న నల్లచీమలబార ఇవి. (అని పారజూచి తనపొట్టమీదయున్న నూగారు చూచుకొనును)

నావెనుకనున్న చెట్లు పిల్లిబెసరచెట్లా వాటికాయలు (అని వ్రేళ్లుచూచుకొనును).

*ఆకొండపయినుండి నావల కొండపయికి దూకుచున్నవి సింహములా వాటినడుములు. (అని తననడుముచూచుకొనును)

ఓహో ఈదరికివచ్చుచున్నవి తాబేళ్లా (అనితన మీగాళ్లవైపు జూచుకొనును)

ఆ ఉరుకునవి లేళ్లగుంపులా వాటిని బెదరించి హుంక రించునవి, శార్దూలములె వాటిపీపుల బొక్కలుగా తీసి తిను నవే ఆ ఎగురు రేచుకుక్కలు వాటిసమూహంబుల తొండ ములతో బట్టి పైకి వెగరవేయశక్తిగల ఏనుగలా! నాపీనుగలు, యేమియీ యీప్రకృతియొక్క చిత్రము. యెఱ్ఱగోరంట్ల పువ్వు ములు, యొకవంక పున్నాగములు, యొకవంక గన్నేరుపువ్వు ములు, నాగమల్లెలు, అడవిమల్లెలు, మంచిమల్లెలు, చింతవృ క్షములగుంపు, వటవృక్షములసాళ్ళు, వేపవృక్షముల యెత్తు, టేకులపోకు, జల్లెళ్ళపాడవు, రేగుల చక్కదనము, పోకల పోకడ, వెలగలవెడల్పు, గురిగింజల పొదలు, మొగలిరేకుల పటుత్వము, కురువకవృక్షముల ఛాయ, లవంగలతకామంచి వెన్ను, గరికసన్నము, మద్దులలావు, వెదుళ్ళచప్పుళ్లు, నీరెళ్ళ నలుపు, జమ్ములయిమ్ము, సర్వేచక్కన, జీలగలవాలు, అశోక ముల కళ, అశ్వత్థంబుల ఐశ్వర్యము, ఖర్జూరములరుచి, క్షీరీ కముల అన, నారికేళముల నైసు, నిమ్మల చలవ, నారింజల తోటలు, నక్షత్రములాను తాళములు, శిరీషముల పుష్ప ములు, నోరూరు దానిమ్మలు, ద్రాక్షలు, తక్కోలల, కర్పూర, చందనాగరు, పిచుమందార, దేవదారి, జాజి, విరజాజి, బిల్వ, స్వర్ణపారేవతములపై గాలియా! యీ గాలి (అని మొఱక పట్టును, గుండెపయి చేయివేసుకొనును)

పచ్చ, మెరుపు, నలుపు, తెలుపు, ఆకుపచ్చ అయిదు వన్నెలుగల రామచిలుకల అవి గోరువంకలు, పావురములు, వాటి సఖ్యమునకు వచ్చుచున్నవె. పయినాకుచున్నవి పచ్చ పిట్టలు. ఇవియే సంస్కృతమున హారితములని పిలువబడును. వీటి గృహనిర్మాణము చెప్పుటకు నలవిగాదు. చక్రవాకములు నెమళ్లు, కాక, ఘూక, బక, బలాక, గరుడ, కోవెల, బరతు, పొన్నంగి, పూరేడు, లావుకపాల, కళింగ, కొంజు, కుక్కుభ,

సారంగ, శరారి, జతుక, చటక శ్యేన, భరాద్వాజ, శకుంతల, చిందకారుకోళ్ళ సందళ్ళా అవి.

(ఆలకించును)

గీ॥ బంతిచామంతిపువ్వుల ♦ పరిమళంబు
ప్రభలుతులసి రుద్రజడల ♦ పత్రములును
మిగులుబంగాళ ప్రొద్దుది ♦ రుగుడుబూలు
గనగదవన గులాబులు ♦ వనమునయ్యె.

( రెండడుగులు ముందునకు వేసి ) అది అవిశయా దానికల్లు కొనునది తములపాకు తీగయా. స్త్రీ పురుష సంగభావనము ( అని చేతులతో తనకుతాను కౌగలింతబట్టును. ) ఏమి దాని యాకు కోసి కొరికి చూచెదన (ఒకఅడుగువేసి) ముందు బంతి చామంతి పూలుగోసెదన తులసిదళము త్రెంచి నోటిలోవేసె దన లేక రుద్రజడ వెన్నువిరసి చెవులోనుంచె దన బంగాళ ప్రొద్దుదిరుగుడు దవన గులాబుల (అని ఒకపువ్వుత్రెంచి చేతబట్టుకొని నిష్క్రమించును.)

(తెర క్రిందకువాలును.)

ఇ ది ద్వి తీ యాం క ము.



శ్రీ

# మోహిని.

## తృతీయాంకము.

ప్రథమరంగము—సువర్ణగృహము.

( రాక్షసులు ముందునడువ దేవతలు వెనుకకునడవ అమృత భాండము అరిచేతిలోఁబెట్టుకొని మోహిని ప్రవేశించుచుండును. )

మో- దానవాధిపా. ధైర్యముజేసి యమృతపు కడువనాచేతికిచ్చితిరి నేను స్త్రీనిసుమా ( అని అమృతపు కడువ మణిపీఠము పయి దించును.

గీ॥ మూటిముమ్మాటికినిమీకు ♦ సూటిదగుల
చూచుడెల్లైనతగువాయి ♦ చూడతగదు
బొప్పిగట్టిన వెనుకను ♦ ముప్పువచ్చె
ననుచు తవిసిన ఫలమేమి ♦ యానుగాన

ఇంద్రు—ఆ॥ నీదు యిష్టమనుచు ♦ నీకునిచ్చితి మమృ
తమిపుడడ్డమేమి ♦ తక్షణమున
భాగసరిగనివ్వ ♦ పక్షపాతములేక
మారుమాటమాకు ♦ మరలరాదు॥

మో—(బలిచక్రవర్తివంకజూచి) మామగారూ నీయిష్టమేమి నీలోనె యున్నది కథంత చెప్పుము.

బలి—సీ॥ నీకన్న చుట్టంబు ♦ మాకింక నెవ్వరు
సంశయంబును మాను ♦ చంద్రవదన
హారిహారాదులకైన ♦ యడ్డమే నీమాట
కడువచేతనఁబూను ♦ కంబుకంఠి

మానోముఫలముల ♦ మాభాగ్యవశమున
ముదముగంటిమినిన్ను ♦ మృదులగాత్రి
కాదనువారేరి గలర ♦ యిచ్చటలేరు
దూరమదేలను ♦ కీరవాణి.

గీ॥ సారెసారెకుయడుగుట ♦ సద్గుణవతి
వలదు వలదింక మమ్ముల ♦ నిలకుతిలుక
పుట్టుబెట్టినవారికి ♦ భువనలక్ష్మి
రమ్మ శ్రీజగన్మోహిని ♦ సమ్మతముగ.

మో- అంతేన మరదిగారు

బా- అంతగాక మరియెంత సేవింతయె మాకు పండుగ

మో- నీవుజెప్పవుబావగారు. ( నముచివంక జూచును పమిడి చెరుగు కొంచము తొలగదీసి మరలసవరించుకొనును. )

నము- కాముని చేతికత్తారి రామలలామ. నీకోసముకై కుబ్బబట్టి యుంటిమి. నీవులేసి నిముషమామాకొక యుగముగా తోచు చున్నది. నీదయ (అనిచేతులు నలుపుకొనును)

కా, కే, శ, రా- అబ్బబ్బమనవద్దకు ( అనిపండ్లు కొరుక్కొనుచు దగ్గరకు బోవుదురు. నమస్కారపూరితులయి కూర్చుందురు మోహిని చే సైగజేయ లేచి )

కా- నన్ను చేసైగజేసిన దంతేచాలురా. ( అని యీవలకు పరు గెత్తును )

కే- నిన్నుగాదురా నన్నుసేసినది (అని రొమ్ముపై చేయిబెట్టి వురుకును.)

శంబ- అరే నాకల్లిర చే యూపినది (అని తొందరగ వచ్చును)

రాహు- కాదుకాదు నేనెట్టిటోన్నిర నాకల్లిజూచన్నది. (అని చంకలు గొట్టుకుంటు దూకును)

వరు- గీ॥ ఒక్కమాటలోమమ్ముల ♦ చక్కజేసి

సూర్య- యింకాలస్యము జేయకుము అలస్యమయిన అమృతము విష మవునని పెద్దలు చెప్పియుండిరి

మో—మీరంత త్వరితముగా వెళ్లి స్నానముజేసి ఖద్దరు ధరియించి శుచులైరండి పొండి

(అందరు నిష్క్రమింతురు)

మో—సీ॥ పక్షపాతములేక ♦ పంచియిచ్చితినేని
సురరక్షణంబెట్లు ♦ చూపనగును
ఎంతోనమ్మినయున్న ♦ యింతియైననునన్ను
సంతసంబున ♦ సరాసరిగ వారు
అసురులకమృతంబు ♦ యందనిచ్చుటకన్న
సర్వంబులకు పాలు ♦ సరగమేలు
నేను జెప్పినయట్లు ♦ నియతివర్తింతురొ
బలిమిచేతనువచ్చి ♦ పట్టుబట్టి
గీ॥ మాకుముందుగనివ్వుము ♦ మంచిదాన
యనిన నేనేమిబొంకెదన్ ♦ వినినదాన
మాయజేసెద లోకంబు ♦ మహిమలోన
సజ్జనుల రక్ష దుష్టశి ♦ క్షణముగాన॥

దుర్జనులపుట్టు మట్టుబెట్టుమని బ్రహ్మతో జెప్ప నా చెప్పిన సజ్జనుల కందమెక్కడిది నేనీయవతారములు దాల్చక యుందున. యుండిన సుజనుల రక్షయెట్లు ప్రకృతిలేకుండా శివుని కాజ్ఞాపించెదనా అటుల నాజ్ఞాపించిన నీనాటక మెటుల గందు. నాటకముతో పనియేమని చాలించుకొందున నేజేయు పనియేమిటి. పనజేయకున్న యేమని నాకు నేను యనుకొందున. యనుకొనకపోయిన కష్టమేమి. సుఖమాసుఖము లేదు కష్ట ములేదు రెండులేక వ్యర్థమా. ఔను నాస్వభావము. కాదు కాదు దానిస్వభావమునరె. దానికిస్వభావమున్నద ఏమొ తెలి యదు. తెలసుకొందున నేనుమంచిపనియేక. మంచిపనియేమిటి పెద్దలు నిర్మించినదా భాగాయున్నది. నాకు నే, నేన యనుకొ నుట? లేకపోయినఅంతె ఉన్నా అంతె దీనికిమాత్రము సాక్షిమె వరు ఊ లేకపోతె లేకపోవును సిద్ధాంతమె?

చ॥ భయమున రాక్షసాధములభద్రము జేయుకయున్న లోకముల్
నయమునఁ బెంచునా వినగ ♦ నమ్మినవారికి కీడుగల్గుదే
జయమును గోరి దేవతలు ♦ సాహసముల్ తెగ జేసినారు నే
రయమున వారితో గూడపడ ♦ రాదని యుండుటమంచిమార్గమే॥

ఆ॥ సాటుమాటలేల ♦ చక్కగా పఙ్క్తులు
రెండుజేసియుంచి ♦ రెప్పపాటు
గనసుధారసము ♦ జగములలర
సురలకందునట్లు ♦ జేసి యసురు లలుగ॥

అంతరహితంబయ్యెద. అటుమీద నేమవునో చూచెద. వచ్చుచున్నారె దేవతలు రాక్షసులు సువర్ణగృహమునకు వారు వచ్చువరకు అమృతకుంభము పట్టుకొనియుండెద (అని అదే ప్రకారము నిలువబడియుండును. పయ్యెద నటునిటుతొలగించుచుండును.)

(దేవతులు, రాక్షసులు శుచులై ప్రవేశింతురు)

బలి—జగన్మోహిని నీవుచెప్పినట్లుగానె వచ్చితిమి. యింక నేమిసేయమనెదవు?

మో—యింక సేయునదేమున్నది. అందరు కూర్చొనండి

అందరు—చిత్తము (అని అగ్రపీఠంబులపై కొలువుదీరుదురు)

మో—ఎలాకూర్చుండవలయునో మీకు తెలియదా? యిలాకూర్చుంటె నేనేల అమృతమిచ్చెదను.

అందరు—నీవు చెప్పినట్లు నీవు చెప్పినట్లు (అని లేచి నిలువబడుదురు)

మో—నేజెప్పునదేమనగా మీరంత కశ్యప ప్రజాపతిసంతతివారలైనను మీకప్పుడప్పుడు వైరములు గల్గుచుండును ఈ తగాదలన్ని నాకెందులకు( ఎవరికివారు విభాగములయి సురాసురలు తేటతెల్లముగ కూర్చొనండి. అప్పుడు నా యిష్టమువచ్చినట్లు జేయుటకు నీలుగల్గును ఈవేళ నాకు పంచేయుండలేదు. మీకమృతమెట్లు యిచ్చెదను (అని కుచ్చిళ్ళు సరిజూచుకొనును)

( చెప్పినప్రకారము కూర్చుందురు )

మో—(సుధాకుంభము చేతబుచ్చుకొని కుడిచెయి లోనుజేసి దేవ
తల కమృత మిచ్చుచు)

గీ త ము.

వచ్చెదర్ ఇచ్చెదన్ వాహ్వారే యీ యింతిగుణములు
కనుగొనండి ॥వచ్చె॥

సాహసమును జేయజాల సంకోశ మేమియులేదు బాల
సుశీల తళుకులుచాల కులుకులు కేల యసుకులపాల ॥వచ్చె॥

నారాయణ కవిపాల నమ్మినవారిని నేల చలమేల యసు
రులపాల ॥వచ్చె॥

( సూర్యచంద్రులు కనుసైగచేయుదురు. శ్రీ మహావిష్ణు చక్రాయుధ
ముచే రాహువు శిరచ్ఛేదనజేయును. అంతరహితం బవును )

శిర—(పైకిబోవుచు, సూర్యచంద్రులారా, నా గొంతులోనికి అమృ
తము జారకమునుపే కనుసైగజేసి శిరచ్ఛేదన జేయించితిరి
శ్రీమహావిష్ణువుచే యికమిమ్ముల పర్వదినంబులందు పట్టివేధిం
చకపోతిన నాపేరు రాహువుగాదు. ఇదిగో పోవుచున్నాను.
మహాకాశములో దాగియుండెదను.

(అని కానరాకపోవును)

బలి—సూతా, యుద్ధమునకు రథంబు నాయత్తపరుపుము. కాలకే
యులారా! ఆలస్యమెందులకు రండి రండి ! నముచి శంబరా
సురులారా? (అందరు నిష్క్రమింతురు)

2 రంగము - నొక పెద్దమైదానము.

(దేవాసుర యుద్ధము)

బలి—ఇంద్రా దురాత్మా, యిదిగో కాచుకొనుము. నా యగ్నిబా
ణము వచ్చుచున్నది

ఇంద్రుడు— బలీ యికనే బలవంతుడనయితిని. నీబాణములు నన్నేమి
సేయజాలవు. యిదిగో వారుణబాణ మెక్కిడుచున్నాను నీ
బాణమునకు (అని ధనస్సునకు బాణమెక్కిడును)

నము—పగటిదయ్యానూ రమ్మా నాకత్తికి నాహుతిజేసెద నీశిరము

సూర్య—నముచీ! నీ నిముషములో నీతల నఱికెదను చూడుము
(అని కత్తి ఝళిపించుచు యెదురు వచ్చును)

వరు—నా గదాదండముచే నీ శిరస్సు యెగురగొట్టెదను చూడుము
శంబరా!

శంబ—ఓహో! నీవా నాశిరస్సు యెగురగొట్టుట. వరుణ నీవుగొట్ట
కేమి? నేచూడకేమి, రా! (అని గద యెత్తును)

బాణా—వైశ్వానరా, వురుకకు నీ యస్త్రమునొకసారి నివ్వు.

వైశ్వా—ఏమిభాణాసురా, నీ హెచ్చుమాట నాసంగతి తెలియుదు
గాబోలు నీకునేను అగ్నిని జాగ్రతసుమా? యిదిగో అస్త్రము
వచ్చుచున్నది (అని నిలువబడును.)

వాయు—కాలాసురా! గట్టిగయుండుము నా బాణపరంపరలచే నిన్ను
పడగొట్టెదను యిప్పుడే

కా—గాలిదేవా? నీ గండ్రతనమిక్కడ గాదు. ఎండిన వగుడాకుపయి,
వరిగెవోదెలపయి, ఆవుదపాకు వరుగుపయి చూపించుము
(అని బాణము తొడుగును) ధనస్సునకు

కే—ఒరే దండధరా, యికనిలువుము. నా గదాదండము వచ్చుచు
న్నది నీపయికి

యము—కేయుడా నిన్నిప్పుడు మాయముజేసెదను.
(అని పాశము యెగరవేయును. గదాదండమెత్తికొట్టును)
(అందరు ఎవరుపూనినపని వారు చేయుదురు)

అందరు—(అటునిటు తిరుగుచు ఏజతకు ఆజత) వేయు పోడువు కొట్టు
(అని యుద్ధముజేసి పడిపోవుదురు)

ఇంద్రు—ఆ॥ రణమునందునన్ను ♦ రాదుగెలువనీకు
యసురనాధియింక ♦ యరుగుమిపుడు
శరణమన్న నిన్ను ♦ రణమునవిడుతును
ప్రాణమున్న సుఖము ♦ వడయవచ్చు॥

దేవ—(లేచి బలిపయికి నురుకబోవ)

బలి–ఆగుడి (అని అందరి నన్ని బాణములచే పడగొట్టును పడిపోవుదురు)
ఇంద్రా నేమంటివి.

ఆ॥ జయము లపజయములు ♦ సంపద లాపద
ల నిల చలితదీపి ♦ కాంచలములు
చంద్రకళలు మేఘ ♦ చయములు దరగలు
మెరుగుల మరవర్య ♦ మిట్టిపడకు॥

గీ॥ మరచిపోయిన మాటలు ♦ మరువదగునె
గడచిపోయిన కార్యంబు ♦ గడువనగునె
విడచిపోయిన ధర్మంబు ♦ విడువనగునె
దడిసిపోయిన సుఖమును ♦ తగినసుఖమె॥

ఇంద్రు–గీ॥ వచ్చినను రమ్ము యాలస్య ♦ మచ్చుబాలె
బాణవర్షంబు గురిపించి ♦ భగ్గుడగ్గ
పడిన నిను గెలిచెదను శ ♦ భము పడెదను
తెలియు బలికితి ముందుగ ♦ నిలునిలుమిక.

బలి—ఉడుతల వ్రాపులకు వేపిలుకదులునా! కదులవు. యింతమా
త్రమునకే భయపడెద ననుకొంటివా! నీవు "తొండముదిరి
ఊసర వెల్లి" యయినదన్నట్లు మాట్లాడుచుంటివా? బలిచక్ర
వర్తి శరీరములో జీవుడుండువరకు రెండవవాడు బలీ యను
టకు నోరువచ్చునా? ఏమి నీప్రగల్భములు గృక్కెడు యమృ
తము పుచ్చుకొంటి ననుకొంటివా దొంగయయి శ్రీ మహా
విష్ణు మీా కమృతము యిచ్చినది యెరుగవా? నన్నెరుగవా?
(అని మీాసముపయి చేయివేయును)

ఇంద్రు—నీవే స్వర్గము నెల్లకాలము నేలెదవా, యితరుల సొమ్ము
నీకు రుచియా అతిధిసంతానము ఆయురారోగ్య ఐశ్వర్యములు
పొందవలదా, నీకు కష్టమా! కష్టమయిన ఈసారితో నీకష్ట
ములు కడతేరును.

(అని ధనస్సునకు బాణము తొడగును)

బలి—(ధనస్సు నెత్తిపట్టి)

గీ త ము.

వచ్చుచుండె నస్త్రము - వయ్యాలవును శిరమురా॥
ఇంద్రు-పులికి యలుకుగలదుజూ - బూబూచిగాదురా॥
బలి—పిరికిపంద వీవురా - పరుగుబట్టుకుందురా॥
ఇం—మదముబట్టినావురా - గదిమికొట్టెదనురా

(ఒకరిపై నొకరు బాణవర్షము కురిపించుకొనెదరు, బలి మూర్ఛిల్లుచు "అసురులారా" అనును)

అసురులంత-(లేచి యింద్రుని చుట్టుముట్టుదురు)

నము— గీ॥ పౌర్ణమునకు మొదటినెల ♦ వైనమేను
బ్రతికియుండగ నీవును ♦ బ్రతుకగలవె
కత్తిచేతను నిన్ను కా ♦ మొత్తివేసి
జయముబలికి జే జే యన ♦ జయముగాంతు.

ఇంద్రు—నిలిచెదవా నముచి ? (అని వజ్రాయుధ మెత్తును)
నము—(ఖడ్గము గిరగిర ద్రిప్పును)
నార—శ్రీ మద్రమారమణ గోవిందో హరిః

గీ త ము.

ధనము శాశ్వితమె మనకును మును-ధనము శాశ్వితమె
మనకును మును ధరాతలంబున ధరాతలంబున ॥ధన॥
దయామయుని కమలనాభుని గనుమె ॥ధన॥

( ప్రవేశించి )

సురాసురులారా ! మీరీ యుద్ధమును చాలించుడు. బద్ధ
వైరము ప్రాణహాని మానసనష్టము అదియునుంగాక

సీ॥ గెలుపు వోటములురెండు ♦ కలనమందునగావు
నిలకడజూపుటే ♦ నిశ్చయంబు
కామాదిశత్రుల ♦ ఖండించివేసిన
వాడికన్నను జయుఁ ♦ డేడి భువిని

రణమునందున జచ్చి ♦ రాజులై పుట్టిన
ఫలమేమి లేదని ♦ పలుకవచ్చు
అష్టభోగంబులు ♦ కష్టంబులకు గాని
సుఖపడుటకు గాదు ♦ చూడరయ్య॥

గీ॥ ఒక్కమాటను వినరయ్య ♦ తక్కువేమి
మీకు యెక్కువేమి తగదు ♦ మీరుమీరు
చంపుకొనుటకు యత్నింప ♦ తెంపుజేసి
పిసుపుడికనైన రోషంబు ♦ వేగపడక

క్షేత్రములు విభాగములయినను పంట యొక్కటే గనుక వివాదములను కలుపు పెకివేసి సమానమను పైరును బెంచి సత్యమను కల్లములో నుదిసి యసత్యమను పొట్టు వైరాగ్యమనుగాలిచే నెగురగొట్టి మిగులునది పంచి గుడుచుటేమంచిది. ఏమి ద్విజులారా! దానవులారా! నేజెప్పునది పుర్రెకెక్కినదా యెక్కనియెడల నాపంటయే, నాభోజనమే, నాకేమి (అని చెంకలు వాయించును. మరల నాగీతము జదువును)

గీ త ము.

ధనము శాశ్వతమె మనకును మును- ధనము శాశ్వతమె మనకును మన- ధరాతలంబున ధరాతలంబున ॥ధన॥
దయామయుని కమలనాభుని గనుటే ॥ధన॥

బలి—సమానభాగమా అమృతమును యిరువురు జేసినయమృతమును వారే పానీయముజేయుట న్యాయమా నారదా!

ఇంద్రు—సరె సరే! శోణపురంబువారిది స్వర్గపురంబుమాది, మమ్ములగాదని రెండు వారేలుట న్యాయమా నారదా?

రా—చెప్పవేమి నారదా?

దే—చెప్పవేమి నారదా?

నార— (తనలో) మమ్ము బొమ్మన్నందులకు నేను వచ్చినందులకు సరిగ సరిపోయినదన్నట్లున్నదే? మేయబోయి మెడకు దగిలిం

చుకోవడం మయ్యి బంపితే రావడం (ప్రకాశముగా) సరే నేను వెళ్లుచున్నాను. మాతండ్రియగు నలువ బంపగా వచ్చితిని. చెప్పితిని యికను

ఆ॥ ఇష్టమేదో మీకు ♦ ఇపుడు జెప్పుదు నాతో
మరలవస్తు జెప్పి ♦ మాటగాను
కలహాభోజనుండ ♦ గానిందు నన్నైన
నష్టపడెడువారు ♦ నష్టపడుదు॥

దేవతలంత–నారదమునీంద్రా నమస్కారము (అనిపోవుదురు)
రాక్షసులంత–నారదమౌనీ వందనములు (అని నమస్కరింతురు)
నార——ఉభయులు శుభంగుండాలి

(అందరు నిష్క్రమింతురు)

నార——పరంధామ ఏమి నీమహిమ, చక్రని ప్రకృతిని చౌకజేయుట నీవంతె పిరియము జేయుట నీవంతేనా! ఓహో ప్రకృతి యెవరిది బుట్టింప బెంప చంప నీవైయుండ పొరపడితిని పొరబడితిని

గీతము——నాదనామక్రియ రాగము - ఆటతాళము.

వైకుంఠవాస శౌరి - వందనమిదిగో గొనుడి
సుందరవదన మోహారి - వందనమిదిగో గొనుడి ॥వై॥
నారాయణ కవిని నేలు - నారాయణ నీమేలు
సారాంశము దెలసినచాలు - సరసులకు సంపద ప్రాలు ॥వై॥

(నిష్క్రమించును)

ఇది తృతీయాంకము.

---

శ్రీ

# పెహా హా ని.

## చతుర్థాంకము.

### ప్రథమ రంగము - వైకుంఠము.

(పార్వతి పరమేశ్వరులు నందివాహనారూఢులై ప్రవేశింతురు శ్రీ మహావిష్ణు దర్శనమునకు)

పార్వ—స్వామీ భక్తసంరక్షణార్థమై వెళ్ళియుండునేమొ భగవంతుడు మనము వెళ్లువరకు

పర—ఓహో పిచ్చిదానా! భగవంతుడొకచోట లేకయుండునా అంతటాగలడు

పార్వ—కలిగిన మనము వెళ్ళడ మెందులకు యిచ్చటనే చూడకూడదా భగవంతుని స్వామీ పొరపాటేమయినా యుండిన అడుగుటలో తెలియపరచుము తెలుసుకొనెదను

పర— గీ॥ మనసు నిశ్చయమైన ♦ మనకు నిచట
గానుపించును దైవంబు ♦ గాంచుటకును
వచ్చియుంటిమి వైకుంఠ ♦ వాంఛతోడ
నచటనుండును తప్పక ♦ నమ్ము మబల॥

పార్వ—అధ్యాత్మవిధులు మన శరీరములోనే భగవంతుడు గలడని చెప్పుచుందురు. "వాలాగ్రశ్య శతభాగః" అనగా మన వెంట్రుక చివరభాగము నూరు విభాగములుజేసి దాని మరల నొకభాగము నూరు భాగములు జేసినయెడల దానిలోనొకభాగము ప్రమాణ ముగల జీవుడుగలడు ఆజీవిని శరీరముగా జేసికొని భగవంతుడు గల డనియు చెప్పుచుందురు.

పర—వాడిగల సూదికొనమోపు స్థలము సందులేక అంతట నిండి యున్న భగవంతుడు శరీరములో నెంకులకు యుండడు యుండును

పార్వ—సరే! చిత్తము

గీ॥ ఎంతదూరము మునుగవలె ♦ యిపుడుమనము
ఇచటి కెంతవచ్చితిమియో ♦ యెరుగబల్కు-
మాగియున్న త్రోవ కనుక ♦ మరుగుపడక
చంద్రశేఖరవందిత ♦ సమరసభవ॥

పర— గీ॥ మధ్య మణిపూరకంబను ♦ మజిలిదాటి
గన ననాహతము నదిని ♦ గడచినాము
విన విశుద్ధము నిదిగను ♦ విడువకుండ
భామలసంగున మహిమంబు ♦ బోధపడును
దానిగడచిన వైకుంఠ ♦ ధామమదియె॥

పార్వ—నాథా! సమముగా సగమరుదెంచితిమా యిప్పటికి మనము బయలుదేరి యెంతకాలమయ్యెను. యిక నెంతకాలముపట్టును. భగవద్మందిరము జేరుటకు

పర—అయిదునిమిషములు మాత్రము నయ్యెను. ఇక నైదునిమిషములు బట్టును

పార్వ—సరే ?

పర—మన కోడెకు నీళ్ళుజూపించెదను. అలసట జెందియుండెనేమొ

పార్వ—అయిదు నిముషములకే అలసటజెందెనా ?

పర-- 5,3200 వందలామడ వచ్చియుండె నిప్పటికి నిక నంత వెళ్ళవలసె

పార్వ—106400 వందలామడ మన కైలాసమునకు వైకుంఠమునకు

పర-- ఔను !

పార్వ-- కాలినడక నడచిన యెంతకాలము పట్టును

పర-- పది నిమిషములే

పార్వ- శకటమయిన
పర-- పదినిమిషములే
పార్వ- విమానమైన
పర- పదినిమిషములే
పార్వ- ఏమిటది ?
పర- నిజము.
పార్వ-ఏమిదృష్టాంతరము ?
పర- మకరిచే జిక్కి గజముపిలువగనే వచ్చి రక్షింపలేదా ?
పార్వ—భక్తియున్న శక్తికాలడియ నే నీయభిప్రాయము?
పర—ఔను
పార్వ— సరె.

(మరల నందివాహనా రూఢులై పోవుచు)

పార్వ—స్వామీ ! మీభూషణములేమొ బుసకొట్టుచున్న వీవేళ
పర—చందనతరువులపై రాబడిన కిశోరవాయువులను బీల్చుచున్నవి.

( తెర తిరిగి )

పార్వ—ఓహో! అవి యేమివృక్షములు స్వామి, చాల విశాలభావ మిచ్చుచున్నవి
పర—పారిజాతములవియె అడిగినకోర్కెల నిచ్చునవి

సీ॥ అదిగదా వైకుంఠ ♦ మదిగదా శ్రీపుర
మదిగదా సాధుల ♦ యమరపురము
యదిగదా యుద్యాన్న ♦ మదిగదా ప్రాకార
మదిగదా దైత్యుల ♦ హారణపురము
యదిగదా యండాండ ♦ మదిగదా పిండాండ
మదిగదా బ్రహ్మాండ ♦ మవలపురము
యదిగదా గోపుర ♦ మదిగదా భవనంబు
యదిగదా రత్నాల ♦ యగ్రిగృహాము
గీ॥ అదియె శ్రీలక్ష్మియుండెడు ♦ యంతిపురము
యదియె భగవంతుడుండెడు ♦ హృదయపురము

యదియె లోకంబులకునెల్ల ♦ మొదలిపురము
యదియె శుకశౌనకములును - నలరు గృహము॥

పార్వ—స్వామీ మన కైలాసమునకు యీపట్టణమునకు భేదమేమైన గలదా

గీ॥ కడుముదంబున జెప్పెము ♦ గలిగెనేని
భక్తమందార వననిధి ♦ నందనంబు
ఆడువారితో పయనంబు ♦ నందదనుక
జోడుగలసినవారికి పీడుగలదె॥

గీ॥ చెప్పెదను వినుపార్వతి ♦ చిత్తమందు
గురువు శిష్యునకుజెప్పు ♦ కూర్మితోడ
యటులనీకును జెప్పెద ♦ నరయుమనము
సరిసమానపు నడకలు ♦ జరుపవలయు॥

అచ్చటనుండువారు అడ్డముగా బెట్టునిడుదురు, ఈ పట్టణములోగలవారు నిడివిగా బెట్టుబెడుదురు అంతియే భేద

పార్వ—ఆభేదమేమి స్వామీ! నిన్నడుగుటకు యెప్పుడు వీలుగాక యూరకుంటిని సెలవియుమిప్పుడు

పర—నేను లోకముల పడద్రోయువాడను యీవిష్ణులోకముల నిలువ బెట్టువాడు దానికి సూచన

పార్వ—బ్రహ్మపుట్టువునకు గురుతా నాచుక్కబొట్టు, సరే యిప్పటికి నా సంశయముదీరెను, ఓహో! అనుకుంటుండగనే వైకుంఠపుర సింహద్వారమువద్దకు వచ్చియున్నామే స్వామీ నేను వృషభేంద్రునిపై నుండి దిగెదను. మీవెంటవచ్చెదను.

పర—యిరువురము దిగుదము. ( అని దిగుదురు )

తెర లేచును.

(శ్రీ మహావిష్ణు లక్ష్మి ఆసీనులై ప్రవేశించి యుండెదరు, పార్వతీ పరమేశ్వరులనుజూచి లేచి యెదురువత్తురు)

శ్రీమ—క్షేమమా (అని పరమేశ్వరుని హస్తమందుకొని విడచును.)

పర—క్షేమమె మాకుమీకు

క॥ మనవారలెల్ల క్షేమమె
మనవారలు గానివారు ♦ మహిలో లేరూ
మనవారలంత క్షేమమ
మనమున యోచించిదెలుపు ♦ మరువనిమిత్రా॥

శ్రీమ—సదాశివా! నీవిచ్చు యభిప్రాయము గాంభీర్యము గదా

లక్ష్మి—అమ్మా పార్వతీ! కుశలమా, మీకువస్తూ చిన్నబ్బాయినన్నా వెంటబెట్టుక రాలేదు

పార్వ—(చెక్కిలిగువ్వ- చుబుకము పట్టుకొని) ఆయనకా ప్త కాళ్లు వచ్చినవి ఆయనెక్కడుంటాడమ్మా మావద్ద జొన్నపైరు నెక్కడశాగాపంటునో అక్కడకు వెళ్లుతాడు మీ చిన్నబ్బా యేడమ్మ మీవద్ద లేడు?

లక్ష్మి—ఓహో! ఆయన మాతావున నిలచుచున్నాడ, ఎచ్చట వయసు వారుంటే అచ్చటకు వురుకుతాడు

(నలువురు ఆసీనులవుదురు.)

పర—దేవా? నీతో నొకమాటయున్నది.

శ్రీమ—అలాఅయిన మన మందారవనములోనికి వెళ్లుదము

పర—సరె (అని లేచును) (వెంటనే తతిమ్మావారు లేచి నిలువబడుదురు -నిలువబడి)

శ్రీమ—(లక్ష్మివంకజూచి) నీవు మేము వచ్చువరకు తొందరగా వంట జేయింపుము.

లక్ష్మి—చిత్తము ఒక్కమనవి

గీ॥ ఎనిమిది విభూతులెప్పుడు ♦ యింటనుండు
ప్రబలురజితాద్రి వారింటి ♦ పరుపుబండ
యింతులకుతల్లి పార్వతి ♦ యింటివెలది
పేదవారలవిందులు ♦ ప్రేమమహిమ॥

శ్రీమ—నీకు చేతనయినంతవరకు చేయుము వారు ప్రేమింతురు.

లక్ష్మి—ఆలాగె అమ్మా నీవుకూడా వెళ్లుతావ

పార్వ—ఎప్పుడు ఈపాడుసంసారములో మునగానాం తేలానాం.

(అందరు నిర్గమింతురు)

2. రంగము- మందారవనము.

(పార్వతి పరమేశ్వరులు శ్రీమహావిష్ణు ప్రవేశింతురు)

పార్వ—స్వామీ? ఈపారిజాతములు మనతోటలో వేయించెదమా విత్తనములడిగెదమా.

పర—చూచిన ప్రతిదానికి నట్లుపోవచ్చునా.

పార్వ—(తనలో నటుమరలి)

ఆ॥ కోరరానికోర్కె ♦ కోరినఫలమేమి
పొరబడితినిపుడును ♦ మరలనడుగ
ఆశచేత సకల ♦ మాశించుపనెకాని
తరుగువిడున పూర్ణ ♦ తరముగాగ॥

ఎంతవరకు ప్రాప్తించునో నంతవరకు తృప్తిపడుటయే సుఖము పూర్ణసుఖము

పర—నేనన్నమాట చెప్పనా!

శ్రీమ—చెప్పుము

పర—గీ॥ పురుషయాకారమునీవు ♦ భువనమంత
మాయజేయుటగాంచితి ♦ మహిమవలన
యాడురూపముదాల్చి నీ ♦ వసురవరుల
వాడి యణచితివట యిక ♦ వాంఛగలిగె॥

గీ॥ అవనిత యవతారమ్ము ♦ నదిమొటులనో
జూపనంతోష మొందెద ♦ సుప్రకాశ
భాసురంబైన నీచిత్ర ♦ ప్రజ్ఞ యెవరు
వర్ణనము జేయజాలము ♦ వనవిహార॥

శ్రీమ—  గీతము.

ఏల యిటులబల్కు ♦ జయ జయ శంకర ॥ఏల॥
ఫాలలోచన పతితపావన ♦ నీలకంఠ నిత్యవిహార॥ఏల॥
మోహినిరూపము మోసముగనుక ♦ సాహసమున సత్య
విచార॥ఏల॥

పర— గీతము.

మారుమాటజెప్పుట జగములతండ్రి ♦ నీమాయకానవలెనేను
జగములతండ్రి॥మారు॥
గానలోలనిన్ను నేనుజగములతండ్రి ♦ కనిపించవలెనింక జగ
ములతండ్రి॥మారు॥

శ్రీమ—సరె (తళుక్కు-మెక్కు- మెరుపు మెరసును మాయమవును)

మోహి— (ప్రవేశించి)

గీ॥ పువ్వుటమ్ములు మదనుడు ♦ పూనుచుండె
పారిజాతమురమ్మని ♦ పలుకుచుండె
పూలకొమ్మలు అందందు ♦ పొలుపుమీరె
లతలగృహములు శయనింప ♦ జతగనుండె॥

(నిలువబడి నటునిటుజూచును పయ్యెదజారవిడచును)

పర— ఎవరు ఈకాంత దయామయవినుత సాగరతరంగ కల్లోల విభ్రమ భ్రమమగుధ్వని నామనస్సునకు కనుపరుచుచున్నది. కానిమ్ము కనుగొనెదను.

(అటు నిటు దిరుగుచు చూచుచుండును.)

మోహి—నాచేతులోబంతికి చామంతికి పందెము.

గీతము.

అదిగదుగో చామంతి పొమ్ము ♦ మదిగుదిరి నాచేతిబంతి
వయ్యెంటె ॥అది॥

(అని విసరివేసును కూడానురుకును)

నీవు దానితోనిలువక క్రిందబడితివా (యని కాలితోదన్నును.)
ఈసారి ఆపండినవెలగల చాయనుందువ (అని చేతికి దీసు
కొనును యెగరవేయును)
క్రిందకు వచ్చుచుంటివా (యని చెంపదెబ్బగొట్టును మరలా
బట్టును చూచును చూచి)
నీవు గుండ్రవెలగలదగ్గరకు పోయివచ్చితివా ♦ నీతోపమావ
ముగావనియు నిజము (అని ముద్దిడును)
అదిగదుగో చామంతిపొమ్ము ♦ మదిగుదిరినా చేతిబంతి
దయ్యెంటె ॥అది॥

(భుజములపైనుండి కుడియెడమల విడచుచు పట్టుకొనుచుండును)

పర— (ముందరకునడచి)

కం॥ ఎవ్వరిదానవు నీవిటు
రవ్వన యేతెంచినావు ♦ రమణముతోడన్
జవ్వని రూపముజూచితె
ముప్పేరి పయివాడికయిన ♦ మోహముగలుగున్॥

మోహి— గీ త ము.

అటుబల్కుటకాహా ♦ విటకత్తెనుగాను నేను॥అటు॥

పర—పరస్త్రీరుచి పాలు పంచదారకయిన లేదుగా ॥ప॥

మోహి—అంతమాటంతమాటాహా ♦ యింతసేపు కాదు॥అం॥

పర—తెలసిపోయెనీమనసు ♦ కులుకులాడియెవరో॥తె॥

మోహి—ఆ॥ మాటలాడవలదు ♦ మగువలతో మీరు
మాటలాడి తిరిగి ♦ మరువరాదు
మాటలాడ మేము ♦ మంచివారమెమీకు
మాటలాడిపొమ్ము ♦ నాటకమ్ము॥

(అని కాలిపై బంతినిలిపి విసరివేయును దానివెంటనంటి వంగి
పట్టబోవును పమిడిచెరగు క్రిదపడును.)

పర—(వెంటనంటి వంగినపుడు వాటువేసుకొనును ముద్దిడును)

మోహి—(వడుపుజేసి వాటుల్లో నుండి దూరి వెళ్లిపోవును)

పర—(వెంటదగులును)

మోహి—( చెట్టులు గుట్టలు త్రిప్పుచు పొదరిండ్లదూరుచు కుంకిళ్లు
పెట్టుచు)

గీ త ము.

కాదు కాదు పో పో సాదులైనట్టివారి సరసనుండగ రాదు॥ కా॥

పర—కాంతానీ వెంత జెప్పిన ♦ సంతోషమయిన కార్యమెంతేని విడువ
జాల॥ కాంత॥

మోహి—వాదమేలమగవాడ ♦ ఆదాయమేమిదీనిలో యగుపడదు
లేదు లేదు॥ కాదు॥

పర-వనితరూపముదాల్చిన ♦ వరహాలకుప్పవుగద వందనములిడుదును
గద॥ కాంత॥

మోహి—మారకోటిసుందరకార♦ దారిదప్పినావు నీవు తేరిచూడక॥ కా॥

పర—నారాయణస్వామి నమ్మిన ♦ వారికేమయినతరుగు వాహ్వారో
లేదు లేదు॥ కాంత॥

మో—సీ॥ మోహనాకారులు ♦ ముగ్ధలమూటలు
గా గానిపింతురు ♦ గాని స్త్రీలు
పయికివెన్నమదిరంపము ♦ భయముతనుగు
కష్టములకుదొంతి ♦ గాంచుయింతి
అద్దంబుపైమెర్గు ♦ యానందవారాశి
వనితరూపముజూడ ♦ భ్రాంతిగల్గు
శిక్షించవలెనన్న ♦ శిక్షించుపురుషుని
రక్షించవలెనన్న ♦ రక్షణమ్మొ

గీ॥ జేయజాలును యేమైన ♦ జేయజాలు
ప్రాణకాంతలు యిటువంటి ♦ పనులుజేయ
పరుల కాంతలమోహింప ♦ బాడియగునె
వెండికొండకు నడుపుము ♦ వేగపడక॥

పర—ఆ॥ కారుమొసగుల పయిని ♦ కనుపించు మెరుగుల
చాయనుండె నీకు ♦ చక్కదనము
కాసిపోను నిన్ను ♦ పదములు యెట్లాడు
పొమ్మనకుము నివు ♦ పొలతినన్ను॥

మో- గీ॥ పుటక తేనియకన్నను ♦ పొలుపుమీరు
పంచదారలకన్నను ♦ పాలకన్న
స్త్రీలమోవియే రుచియని ♦ మూలమెరిగి
కాలమెరిగిన మాటలు ♦ గదుపుమయ్య॥

పర—గీ॥ దయయు చుట్టంబు దైవంబు ♦ దాతనీవు
పయము నాపైని జూపుము ♦ నాతినీవు
అటులగాకున్న యీమెను ♦ పటుతరముగ
విడచిపోవును ప్రాణముల్ ♦ కడకు జెపితి॥

మో- గీ॥ దాసజనులకు బ్రోచెదు ♦ దైవమీవు
వాసవార్చిత నీసేవ ♦ వగుసతోడ
జేయదగినట్టి దాసిని ♦ బాయలేక
పనికిమాలినమాటలు ♦ పలుకవలసె॥

పర—గీ॥ ఆశలేని పుట్టినిల్లును ♦ యడుగ దోవ
మనినయట్లు నావని యిపు ♦ డయ్యగాన
తడవుసేయకు నాతోడు ♦ విడువవలదు
కడకు కైలాసమే నీకు ♦ దడియబోకు॥

మో- గీ॥ మోసపుచ్చిన కైలాస ♦ వాసనీవు
నెత్తికొక యింతికూర్చొని ♦ యెత్తిపాడువ
ప్రక్కనొక యింతికూర్చొని ♦ పకపకమన
చూడు నీయాడుదానితో ♦ సుఖముగలదె॥

పర—గీ॥ ఉన్నకాంతలలో నిన్ను ♦ చెన్నుమీర
నేలుకొనకున్న యిప్పుడే ♦ నీలకంఠ

తగదు నీకిదె యనెదవు ♦ తరుణిగనుము
చెవిసిగూసెద దప్పిన ♦ చివరవరకు॥

మో- గీ॥ కాసిజేయునిదానికి ♦ కష్టమేల
మానుమిక నైన కోర్కెలు ♦ మనసులోన
పాపమునకుపుట్టిల్లు ♦ పణతులనగ
తెలిసికొనినవారలె యిట్లు ♦ తిరుగవలదు.

పర- గీ॥ ఎంతవేడినమనమున ♦ చింతలేదె
సంతసంబున నెలవివ్వ ♦ సాగ జనుల
కష్టపెట్టగ నేలనో ♦ కమలనయన
పలుకులుకులుకున తేనియ ♦ లొలుకబలుకు.

మోహమును వలలో పడద్రోసి నన్ను వత్తిడిజేయకుము చచ్చిపోయెదను దయవుంచుము.

మో- ఏమి! నీవిపరీతవాక్యములు పురుషుల కుండదగిన మాటలివియు అగాయిత్యపుమాటలు. కాకపోయిన చచ్చిపోయిన నెవరికి భయము (అని పొదల చాటుకు వెళ్లును - పరమేశ్వరుడు వెంటనేపోవును.)

మో- గీతము.

రాకురాకు మా వెంబడి రాకురాకుమా - మాకుమీకు చుట్టరికమ ॥రాకు॥

పర—రాకపోదు నా వెంబడి రాకపోదునా షోకుజూచి విడచిపోదునా ॥రాక॥

మో— మంచితనముచే మాటలు మంచిపనముచే యొంచి పలుకుచుంటివ ॥ రాకు॥

పర—పట్టుజిక్కలేమదికి పట్టుజిక్కలే వట్టిమాటగాదు వనిత ॥రాక॥

మోహిని—

సీ॥ పై మెరుంగులెకాని ♦ పసలేని దేహంబు
పై మమతవడుట ♦ బ్రతుకుదెరువ

నిమిషసుఖంబున ♦ కమితదుఃఖమ్ములు
పడగ నేలనో దీన్కి ♦ ఫలితమేమి
నినుజూడగను మోహా ♦ మనువార్థిలోబడి
మునిగి తేలుచునుంటి ♦ మోహనాంగ
భ్రమలకు లోజేసి ♦ పట్టబోకుమునన్ను
వార్చెదు నామేను ♦ వరలునరకు

ఆ॥ సూర్యుడస్తమించె ♦ చూడకు నావంక
చంద్రకళలువచ్చి ♦ చపలపెట్టు
సరసమంత విడువు ♦ చక్కనివాడవై
సతులబాధపెట్ట ♦ సరసమగునె॥

పర—గీ॥ పట్టుబట్టి విడువను ♦ పైకిరాక
వచ్చిపట్టెద యికజిక్కు ♦ మచ్చకంటి
హెచ్చుమాటలదేలను ♦ వచ్చుచుంటి
పోవ తప్పించుకొనిపోవ ♦ పోవునీవు

(అని అడ్డముతిరిగి వచ్చును వెనుకకుతిరిగి మోహిని ఉరుకును యురు
కుదానిని వెంద్రుకలుముడి పట్టుకొనును ముడి
వీడి చెయిజారును)

పర—(కన్నులుమూసి తెరసి)

సీ॥ నీమాయదెలయుంగ ♦ నెవ్వరివశమౌను
నుంటిదెలియ కేను ♦ స్రుక్కిపోతి
ప్రద్యుమ్ను బరిమార్చి ♦ బట్టితినొకవ్రతం
వేలవత్సరములు ♦ వెలదియువక
కన్నుమూసినయంత ♦ కాలంబులోనన్ను
నున్నగాజేసివ ♦ నూరివర్య
మొన్నిసార్లుకునిన్ను ♦ మొరుగదు యీజగం
అధికంబు నీవునా ♦ కధికమయ్య

గీ॥ ఫాలమందున కన్నున్న ♦ ఫలము లేదు
శూలహస్తుడవై యున్న ♦ శుభము లేదు
మున్ను మృత్యువుఁ గెలచిన ♦ మోక్షమేమి
కనుగొని నిను హరియనుచు ♦ గాంచలేక

( శ్రీమహావిష్ణువు ప్రత్యక్షమవును. )

పర- ( రెండడుగులు ముందునకువేసి నమస్కరించును. )

శ్రీమ- గీ॥ వినుము పరమేశ దేవనా ♦ విన్నపంబు
గెలువలేనట్టిమాయను ♦ గెలచినావు
తనవుపై యాశనుమరచి ♦ తరలినావు
భూరి జగజట్టివై పేరు ♦ బొందినావు

పర- స్వామి టక్కుటమార గజకర్ణగోకర్ణ యింద్రజాల మహేంద్ర జాల అగ్నిస్తంభ జలస్తంభముల నయిన చూచి, నేర్చి జయించ వచ్చును. కాని నీమాయజయింప నెవరి తరమవును కాదు కాదు

శ్రీమ—నీవు దక్క విష్ణుమాయను జయించ నెవరుగలరు నీవొక్క రుడవు ?

పర—ఔను! జయింపలేనివారిలో నేనొక్కరుడను

శ్రీ—నీకు నీవనుకొనిన లాభమేమి? యితరు లనవద్దామాట

పర—జ్ఞానముగలవానికితరులనుకొన వలయునా

శ్రీమ—ఆసూచన మీకు సరిగానున్నదని యే నాయభిప్రాయము

(లక్ష్మి పార్వతులు ప్రవేశింతురు)

లక్ష్మి—స్వామీ! చాల ఆలస్యము జేసితిరి

శ్రీమ—శ్రీపరమేశ్వరుడు మోహినిరూపమెత్తి దేవతల కమృతమిచ్చి తివట నారూపము జూచుటకు కుతూహలము గలిగినదని యడుగగా దాని విషయము మాట్లాడుచుంటిమి

లక్ష్మి—బ్రహ్మాదిదేవతలు మీరు చెప్పినమార్గమున బోయి రాక్ష సులను కలుపుకొని మంధరగిరి పెకలించి పాలసముద్రము వేసి

తరచుచుండ అమృతముకన్న విషము ముందుబుట్టినదట దాని
నెవరుపసంహారించలేకపోయిన శ్రీ పరమేశ్వరుడు ఒప్పుకొని
ఉపసంహారింప కంఠమందు యిమిడ్చినాడట

శ్రీమ—చూడవలెననియా నీసందేహము

లక్ష్మి—ఔను

శ్రీమ—నేను కనుగొనవలయునని యత్నించుచుంటిని సమయము

( పరమేశ్వరుని వంకజూచి )

ఆ॥ జీవకోటి బ్రోవ ♦ భారమందున నెంచి
కాలకూటమపుడు ♦ కాదనకను
మ్రింగినావని మీరు ♦ సంగతెరిగియును
యడుగదలచితి నిను ♦ యడుగనైతి

పర—( తనలో ) నే నవమానపడితినని శ్రీమహావిష్ణు నాపయిని
దయచే బుజ్జగించుచుండె గాని నా సంకోశ మింతటితోటి
మానునా,

పార్వ—గీతము

హరియడిగిన సందేహము అనుమానించెద రదియేమొ
సురలపాలన కాదేమొ - చూచిచెప్పరాదేమొ ॥హ॥
విరివిగ నారాయణకవి - పీఠ్రవతంబదియేమొ పురహారవి
ననిజమేమొ - వరములిచ్చుదొరవేమొ ॥హరి॥

గీ॥ భక్తపోషణ నీయందు ♦ భ్రాంతిచేత
రయము నడిగిరి లక్ష్మినా ♦ రాయణులును
భయమదేలను నయముచే ♦ భద్రయశము
గొనెదువారలు మీకేమి ♦ కొత్తటయ్య!

శర—(మెడనున్న నాగభూషణముల నటునిటు నెట్టును)

శ్రీమ—
లక్ష్మి— } (కంఠమం దిమిడియున్న కాలకూటమును గని)

లక్ష్మి—(తనలో)

గీ॥ నీలకంఠ శ్రీకంఠ సు ♦ కాలకంఠ
యనుచు శితికంఠకలకంఠు ♦ డనుచుబిలువ
కారణముగాన యీ మచ్చ ♦ కానబడియె
నల్పమయినను సాంగత్య ♦ మల్పమవునె

నాథా సాధుజనుల యొద్దయున్న బల్పుముల్లుకయిన గౌర వముగలదు. అసాధులయొద్దయున్న రత్నఖచిత సువర్ణపతకము నైన చూడరదేల

శ్రీమ—వేలపుట్లు చదువుగల రాతికంబమయినను పోనిక చక్క సాంగత్యమున తేలియాడును తేలికయయిన నూలిపోగు మల్లె పువ్వములదూఱి అగ్రస్థానమున యలంకరింప బడుటలేదా,

లక్ష్మి—చిత్తము

పార్వ—(సంతోషము రాజిల్ల)

సీ॥ మహనీయులార మీ ♦ మరుగులు దెలసిన
వారికిసుఖమందు ♦ బహుళగముందు
కూర్మావతారమై ♦ కొండవీపునమోయ
యొకరు విషమ్మును ♦ గికురుసేయ
సురరక్షణార్థమై ♦ చూడమోహినివైతి
వేయువిధంబుల ♦ వేరుగలదె
అకలంక చరితులు ♦ సుకరులు శివ విష్ణు
నామప్రభావంబు ♦ ప్రేమమహిమ

గీ॥ కామసంకల్ప రహితులు ♦ కడకుమీరు
భక్తిగలవారి మనముల ♦ పరిఢవిల్లు

స్వాములు మిమునుతింపగ ♦ సాధ్యమగునె
సకలలోకంబులకు మీరు ♦ సత్ప్రభువులు॥

గీ॥ ఇట్టిమీపుణ్య చరితమ్ము ♦ లెవరువిన్న
చదివినను బ్రదర్శించిన ♦ స్వర్గమనగ
తలప యరిచేతియుసిరిక ♦ ఫలముగాదె
విష్ణు శివపురములు రెండు ♦ బిలచుచుండు॥

ఇది చతుర్థాంకము.

శ్రీ మోహినినాటకము శ్రీశివ విష్ణురూపుని కంకితముగా

సంపూర్ణము.

